# లోకరక్షకుని జననము.

—:✿:—

ద్వి॥ శ్రీకరంబుగ సర్వ - సృష్టి నిర్మించి
ప్రాకటంబుగ శక్తి - బరగఁ బాలించి
సత్యవేదాచార - సరణులు నొప్ప
నిత్యకీర్తి వెలసె. - నిజమిది. తత్వ
మారయ, సర్వేశు - మహిలోన జనుల
ఘోర కిల్బిషలతల్ - గోసి మోక్షాప్తి
కగునట్లు చేసి యీ - యవని రక్షించె
నిగమ సంచారుండు - నిష్ఠానఘుఁడు.
గావున సర్వేశు - మన సుచరిత్ర
మీ వసుధ నెగడ - మేకొని భక్తి
గావించి చెప్పెదఁ - గాన మీరెల్ల
సేవించి సత్కథ - చెవులిచ్చి వినియు,
నిత్య దేవుని ముఖ్య - నెలకొన్న మోక్ష
మత్యంత భక్తి, య-మర నందవచ్చు.
దేవ దేవుండిట్లు - దీన మర్త్యులను
గావఁగఁ దిర్చిన - కాలంబునకును
నెనకటి నాలుగు - వేల యబ్దములు
మనుజ సంతతిఁ బ్రోవ - మన్నింప సుతుని
ననుప నూహించుచు - నచటఁ గాఁ బ్రేమ
నా, నతంబు పరుగిడ - ననఘు నీవేగి
కనకాంగి మరియాంబ - కన్యను జూచి
వినుపింపు, శ్రీదేవ - విమల పుత్రుండు

‘ కడుపునఁ గొడుకుగాఁ - గల్గును మీకు,
‘ మడియతనంబున - మనలెడు జనుల
‘ పాపంబు నెడబాపి - పాలించు ననుచుఁ
‘ దీప్రగ నేఁ జెప్పి-తినని చెప్పు’ మనిన,
పలుకులకును సమ-ర్పణములు చెప్ప
సెలవిచ్చి పొమ్మనెఁ - జెలిమితో విభుఁడు.
కన్నియామణి యప్పు - గర్భంబు దాల్చఁ
బన్నగా సన్మతి - పడియుండు. నంత 15.
దేవ పుత్ర విమల - తేజంబు తనకుఁ
బావన గర్భమై - పరఁగనే యప్పుడు.
అటుపిమ్మటను మరి-యాంబ గర్భమునఁ
డటుకున దేవుండు - తరలి విచ్చేయు
టది యెల్ల తెల్పెదఁ - డయ్యెక వినుఁడు
సదమల మతిని స-త్సభవారలెల్ల. 18

వ. దంపతులగు మరియమ్మయుఁ జోజప్పగారు నన్యోన్యస్నేహమున సంతోషచిత్తులై సర్వజనసమ్మతమున నజరేత్తులోనుండఁ సంభవించిన దేమనిన.

సీ. నరనాథుఁడు రోమ-వారి చక్రవర్తి దాఁ [19.
ప్రజలఁ బాలన చేసి - ప్రభుఁడనంగఁ
దన ప్రభుత్వములోని - జనుల లెక్కింపఁగఁ
బనిచె యోధుల మహా-బలయుతులను.
జనులెల్ల జనకుల - యునికిపట్టుల కేగి
పేళ్లు వ్రాయుడఁటంచుఁ - బెద్ద హుకుము
వచ్చినన్, దావీదు - వంశస్థులై యుండ;
మరియ జోసేఫులు - మంద గతిని

దూరి రయొదగి, వలి-తోc దోపులోంటి
దానిలోవల నుండc ; - దరలాతి కుతి
లోనున్న దేవ్రుడు - లోకంబు తో9వc
దన దివ్య మహిమలు - దాచి యీ పుడమి
జనులను తో9వరా, - సమయ మేతెంచె, 33.

సీ॥ పరలోక ధ్యానులై - ప్రబలిన నిర్జరుల్
పశుల కొట్టము కడc - బాటిరొద్ద
జేరి, గర్భస్థుడై - చెన్నుమీరిన కర్త
కనుకూల బుద్ధిచే - నాడి పాడి
జనుల రక్షింపcగc - జనియించు దేవుని
స్తోత్రముల్ చేసిరి, - సొబగు మిగుల
సంతోష ముప్పొంగc - జాల హాస్యముతోడ
సంగీత భజనలు - సలుపుచుండc

తే॥ ఇవ్విధము సకల నిలింప - లింపుcజెంద,
సకల లోకంబులెల్లను - సౌఖ్యమొందc,
జన సమూహము లెల్లను - సంతసిల్ల,
రాజధాని సుధర్మమై - రాజిలంగ, 34.

ద్వి॥ నయ్యెడ నెలలైన - నా యిందుముఖికి
చయ్యన ప్రసవ - సంభవ వేళ
సమకూడె. నప్పుడా - చాన మర్యాంబ
సుమహిత బుద్ధిచే - శోభిల్లి దైవ
సన్నిధిc జేరి యా - సర్వ రక్షకునిc
జెన్నుమీర దలcపు - చేయుచునుండc ;
వినుడు, మేఘము బాసి - యింపుమీరంగc
జనుదెంచు కైవడి - సర్వ రక్షకుడు

తల్లి గర్భముఁ బాసి - ధర బవళింపఁ,
జల్లఁబడె నప్పుడు - సకల లోకములు. 39.

వ॥ ఇవ్విధమున రాత్రినడిజాములోఁ గన్యతనయుఁడు పుడమిస్థైఁ బవళించినతోడనే, సన్మనస్కులా పూజితుని నుతియింపుచు నా బాలుఁడు రక్షణ కొఱకుఁ జేయుపనులన్నియు బాగడి రెఱువలెను.

సీ॥ ప్రణుతించరే బాల - పాదారవిందముల్ ? [40.
వినుతించి వేడరే - వీను లలర ?
ముద్దులు కొనరె యా - ముల్లోక నాథుని
యొద్ద సద్దడక యా - యుర్వి నాథు
కరములు ముకిళించి - కరుణతో మ్రొక్కరే ?
కాచి రక్షించెను - కర్తయితఁడు
పాలించి మన కోర్కె - లాలించి యిచ్చును
మరియాంబిక కన్న - వర సుతుండు.

తే॥ అహహా ! యేమందు మింకను - నతని మహిమ
మోక్ష రాజునకు సుతుఁడు - మోద మలరఁ
బుడమి మానవావతారుఁడై - పుట్టె నిప్పుడు
పశుల కొట్టమునఁ గాటిలోఁ - బాప పగిది. 41.

వ॥ పరమ బాలునిఁ బొగడ సన్మనస్కుల సమూహ ములన్నియుఁ బశులకొట్టముఁజేరి యివ్విధంబునఁ బాటలుపాడుచుండగ నాకాశవీధి నసేక నిర్జరులు పాటలు మిన్నంటఁ బాడుచు నంచున గొల్లమందఁ జాగరించుకొనియున్న గొల్లవారల కట్టి విశేషంబు దెల్పినట నుతువలె. 42.

సీ॥ ఆ రాత్రి బెత్లెహే-మను నూరి పొలములోఁ

గొఱ్ఱెలు గాచుచుఁ - గొల్లవార
లుండ్రి నిమ్నప్రదేశమ్ములు త్త మోక్షములప్పు
డాకాశమున వెల్గు - నట్టె కాంచి
యా వెల్గులోనున్న - యమరుని వీక్షించి
భయమంది దేహముల్ - బడలు పడఁగ;
వడకు చుండెడి వారి - వైపున వీక్షించి
'భయమేల మీ' కని - పలికె నన్న
తే॥ నన్నుఁడో: 'రోరి వినుఁడు జనాధులార!
'పిరికి తన మొంద నేల? నిర్భీతి నుండ
'సమయ మేతెంచె, నొకవార్త - సాంగముగను
'వినుఁడు తెల్పెద, సౌఖ్యముల్ - వేయి గల్గు,
సీ॥ 'వినుఁడి, గోపకులార! - విమలమౌ వార్తలు,[43.
'దావీదు పురమునఁ - దాసుల కొఱకు
'దేవ దేవుఁడు కల్గె - దివ్య తేజంబుతో
'మరియమ్మ కొమరుఁడై - మహిమమీర,
'వేగముగా వెళ్లి - వేడుకలు కలుగఁ
'గనుగొనుఁ డీవేళ - గాఁడియందుఁ
'బొత్తి గుడ్డలలోనఁ - బుణ్యరక్షక క్రీస్తు
'పసిపాపయై నేడు - బవ్వళించె'.
తే॥ గొల్లవారికి నత్స్వాంతుఁ - డుల్లమొల్లఁ
బల్లవింపఁగఁ జెప్ప నా - పైన నుండి
ఖచర కోటులు దేవుని - గానములను
బొగడు కొనుచును టగిరి యిప్పుడమి పైకి 44.
వ॥ ఇట్లు పాడిన నన్ననన్నులంతర్ధానులైన పిమ్మట
గొల్లలు భయముదీరి యానందచిత్తులై దేవ

బాలునిఁజూడ సిద్ధపడుచున్నా రెటువలెను. 45.
ద్వి॥గుప్పున గోపిక - గొల్లలు లేచి
ముప్పిరి గొనువేడ్క - మొనసి వారెల్ల
సుఖముగఁ దేవునిం - జూడంగ బోయి
నిఖిలేశ్వరుని మ్రొక్కి - నిలిచి సేవింపఁ
దడయక రిక్త హ-స్తములఁ బోలేక ;
అడవి గుంటల వస్లు - అటుకులు కొన్ని
అరలేక తమిదల - అప్పాలు కొన్ని
ఒరగుజ్జు గోధుమ - ఒబ్బట్లు కొన్ని 49.
రోట దంచని సజ్జ - రొట్టెలు కొన్ని
వాటమౌ మృదుపిండి - వంటలు కొన్ని
క్రొత్త కొబ్బెల బిళ్ల - కుడుములు కొన్ని
గుత్తంపు టనుముల - గుగ్గిళ్లు కొన్ని
ఉత్త మాంగనులెల్ల - యున్న దున్నట్లు
యెత్తుకొని జనిరి - దేవుని కొఱకు. 52.
వ॥ ఇవ్విధంబున గోపికలున్ను గొల్లలున్ను కానుక
లెత్తుకొని యేకముగఁ బశుల కొట్టంబుకుఁబోవు
సమయమునఁ బాటలుపాడిరఁట యెటువలెను53.
సీ॥ ‹ జనులార ! కాంతమై - జని నిర్జరుఁడు మండ
‹ లించినవార్త నా-లించరారె ?
‹ బెత్లెహేముపురి నొక - పేద కన్యకు మహా
‹ దేవ దేవుఁడు కలిగి - తేజరిల్లుఁ.
‹ బశుల కొట్టంబునఁ - బఱతి పొత్తులఁజుట్టి
‹ గాఁడిలోఁబెట్ట నా - ఘనయుదారుఁ
‹ డున్నవాఁడఁట బాలుఁ - డుర్విలో జనులను

ఁ గాంచి రక్షించెదను - కర్తగాడె?

తే॥ ఁ గాన మనమెల్ల కానుకల్ - కరములందుఁ
ఁ బూని దేవుని హస్తమునఁ - బొగడు కొనుచుఁ
ఁ గాఁడిఁ బడుకొని యుండెదు - కర్తఁజూడ
ఁ సకల జన సమూహములెల్ల - జనరె వేగ. 54.

ద్వి॥ పురుషులు సతులు సం-పూర్ణ సంతోష
కరముగ నూరికిఁ - గారయు నరిగి,
యన్నమాంబ సుపుత్రి - యగు దేవమాత
కన్నట్టి పురిటిల్లు - కను వేగఁ జొచ్చి
గొల్లలందఱుఁ గూడి - కోలాహలముగ
వెళ్లి కొట్టములోన - వేంచేసి యున్న 57.
దేవుని కిచ్చెదు - దీన కానుకలఁ
బావన మతినారు - బ్రేమ బైనఁ బడుచు
వలనొప్ప బాల దై-వమునకు నొసఁగి
తిలకింపుచుండిరా - దేవుని హస్తు.
పరఁగ బాలుని పద - పంకజ యుగళ
మరసి ముద్దాడ మహా-నందాబ్ధి మునిగి
నారులెల్లరు భజ-నలుచేసి కడన
ధారుణీ బ్రఁబడి - తగ మొక్కి జనిరి. 61.

తే॥ ఇట్లు గొల్లలు పూజించి - యింపుమీర
హర్షమున కన్యకాపుత్రు - నరసి యరసి
సంభ్రమంబులు మదిలోన - సందడిగొన
సాగి వెళ్లిరి తమ తమ - స్థానములకు. 62.

క॥ అప్పుడు పశువుల గాపరు
లెప్పటివలె యుండ కడకు - నేగిన పిదప౯

దప్పక యెనిమిది దినముల
గొప్పిదమని జేసు నామ - మొనరం జేసెక్ . 63.
తే॥ జేసువను పుణ్యనామ మీ - క్షితి నరులను
సంతరించెడు వారను - సంజ్ఞకల్గి
భువనములం దృష్టిం జెందించి - పుడమిలోన
ఖ్యాతి జెందెను చంద్రిక - భాతిందనరి. 64.
వ॥ దేవతనయుండు తమ దివ్య జననమును యూదు
లైన నిమ్నపలు గొల్లల కెఱింగించినపిమ్మట నన్య
ములకుం బుట్టబడీని దెలుపుచున్నా డెటువలెను.
సీ॥ దీర్ఘదర్శుండు మున్ను - దెలిపిన రీతిని [65.
నక్షత్ర మొక్కటి - నభమునందుం
బొడమి యద్భుతకాంతిం - బుట్టించి వెలుంగుటం
గనుకొని మువ్వురు - ఘన నృపతులు
అన్యయుండగు దేవుం - డవని మనిషికృతి
గలిగియుండు నటంచుం - జెలిమివారా
లోక పోటంగలసి యాలోచన చేసియు
సైన్య సమేతులై - సుభసమున
తే॥ మణిమయ కిరీటములు మంచి - ఘృణులసీనం
దారవారికి ముందఱ - దారిజూపం;
బరంగ జెరుసల్యమను పేర్ - పట్టణమున
నడుగుడెంచిరి శ్రీ బాల - నరయ నప్పుడు. 66.
వ॥ ఇట్లు జెరుసల్యముచేరంగా నూతననక్షత్రం బదృ
శ్యంబుకాంగా వారలు చేయువిధ మెటువలెను 67.
ఉత్సాహ॥ రాజవర్యులు మువురప్పుడు -
రాజధాని జొచ్చంగా,

నోజనేగుదెంచు జనులు -
నొప్పమీఱ నడగ, : ‘ రా
‘ రాజ పుట్టిన స్థల మెచట -
‘ రయము మాకుఁ దెల్ప రే,
‘ సాజముగను వారికిప్పుడు -
‘ సాగిలపడి మ్రొక్కఁగా ? 68.

ఉత్సాహ॥ ‘ వారి తారఁగాంచి యచట -
‘ వచ్చి చేరఁగ, నదియే
‘ దారిఁబట్టి జనెనో కనము, -
‘ దైవమాయ ’ మఁటనుచుఁ
వార లడిగినను ; జనాళి -
వార్తయుఁగక భీతితోఁ
గూర్చిరుఁడా హెరోదునికడఁ -
గూడి యనిరి యేకమై. 69.

వ॥ అంతట జనులవాక్యములకు హేరోదుఁడు భ్రాంతి నొంది రాజులను గాంచి యేమనుచున్నాఁడు 70.

ఉ॥ ‘ చక్కఁగ నేఁడు మువ్వురును -
‘ సంతస మొప్పఁగ నేలవచ్చిరో
‘ గ్రక్కునఁదెల్పఁ గాలమిది -
‘ గౌరవమొందుచు సంశయంబులే
‘ కెక్కడవాద మాడిరఁట -
‘ కీర్తి బయల్పడ జూద నాథుఁడీ
‘ దిక్కునఁ బుట్టినాఁడనుచుఁ -
దేటగఁ బల్కుఁడు మోదమందగా ’. 71.

వ॥ అంతట ముగ్గురు రాజు లేమనుచున్నారు. 72.

ద్వి॥ వినుము, రాజేంద్రమా! - వృత్తాంతమెల్ల,
‹ జనుదెంచితిమి, తూర్పు - జననాథులంద్రు.
‹ పరమ తత్వసుజ్ఞాన - పారీణవృత్తిఁ
‹ జరియించెదము. తూర్పు - జనపదమ్ములను
‹ గొబ్బున మాలోక - క్రొత్త నక్షత్ర
‹ మచ్చియుఁ గనఁబడె. - నఖిల లోకేశు 75.
‹ ఆర్త రక్షకుఁడైన - యవని బుధుండు
‹ మూర్తిభవించియు - ముల్లోకములను
‹ శాపముక్తి బోఁగొట్ట - బహుజూదతతిని
‹ నాపాదు ననువార్త - ఘనుఁడొక్క దూర
‹ దరిశి దెల్పిన వేద - తత్వంబుఁజూచి
‹ యరసి వచ్చితిమయ్య - యవనేశరుండ '. 78.

క॥ వారడిగిన వార్తలకును
ధారుణిపతి హృదయమునను - దల్లడిపడి నా
మారు జనించెను పుడమికి
భూరమణుండనుచుఁ జాల - బుద్ధిక్ భాగిలె 79.

తే॥ సభికులెల్లరు సభలోన - సందడింప
వేదవేద్యుల నాచార - వివతినెల్ల
సభకు రప్పించి క్రీస్తుఁడే - జనపదమునఁ
బొడమెనని రారాజుతా - నడుగుటయును; 80.

వ॥ వేదశాస్త్రిలందఱు, దీర్ఘదర్శులు చెప్పినది
-వీక్షించి యానందభరితాత్ములై, జూదయా దేశ
మునందు బెత్లెహేమున దయాసాగరుఁడైన
క్రీస్తువు యవతారంబెత్తునని చెప్పిన; హేరోదుఁడు
దుఃఖించి తన సభకు సెలవిచ్చిన వెనుక రహ

స్యముగా నా రాజులతో నేమనుచున్నాఁడు. 81.

ద్వి॥ సుజ్ఞానులార! యా - చుక్క పుట్టినను
(ప్రజ్ఞ మీరంగ మీరు - పల్కరే యుచట?
(ననువుగాఁ బెత్లెహే - మ శిశువును గని
(చనుదెంచిన పిపఁ - జనుదునే' ననుచుఁ
దేన బాలునిఁ జంపఁ - దెంపునఁ దలఁచి
సావును దెల్పక - సాగి పొమ్మనెను.
శలభ మగ్గిని క్రమింగ - జని కాలుకీలిఁ
బలుగాకి పుడమిపైఁ - బడి చచ్చుగాక! 85.
జేసు నపకృతి - చేసెడి వాఁడు
గాసి జెందక యిల - కడదేర డిఁకను.
ఆడిగిన రాజుకు - నన్ని బోధించి
వడికొని లేచి యా - వసుధాది పతులు
రాజును వీడ్కొని - రాజత్రయంబు
తేజీల నెక్కి యే - తెంచి యా పురము
పేటికి వచ్చెసి - పైన వీక్షింపఁ;
దేటమా శుభకాంతి - దెలిపించుచున్న
తారక రాజంబు - దారిఁ జూపింప,
వారు బెత్లెహేము - నకు వచ్చి
యరయుచు నుండంగ, - నాచుక్క మరియ
గురువును గన్నట్టి - కొట్టంబు చేరి
కొట్టంబుపై నిల్చి - కొనియున్న చుక్క
నట్టె వీక్షింపంగ, - నంత మర్యాంబ
సదనంబులోనికిఁ - జని తల్లి బిడ్డ
లాడిగియుండుటగాంచి - కొయ్యన బుధులు ౯౦.

వ॥ ఇట్లు ముగ్గురు రాజులు, మరియమ్మ తన సందిటఁ
బెట్టుకొని యున్న బాల యేసును వీక్షించి
యేమనుచున్నారు. 94.

సీ॥ ‹ దేవాది దేవుఁడా! - దీనులం బోషింపంగ,
‹ దివ్య నక్షత్రంబు - తేజరిల్లఁ
‹ జేసి, సుజ్ఞానంబుఁ - జెందించి మీ శుభ
‹ దర్శన కౌతుక-త్వమున మెరసి
‹ యుండునట్టి యదృష్ట - మొందఁగాఁ బుట్టించి
‹ యింత మట్టుకుఁ దెచ్చి - రింపు మీర.
‹ సద్గురు రాయ! నీ - సర్వ ప్రభావంబుఁ
‹ జెప్పఁగా నెవ్వరి - చేతనౌను?

తే॥ ‹ అహాహ! మా భాగ్యమేమని - యనుదినంబు
‹ పొగడుచుందుము. మీ పద - పుండరీక
‹ ములను సేవించి కడ తేరి - ముక్తిఁ జెందఁ
‹ గోరి విచ్చేసి నారమో. - ధీరవర్య! 95.

తే॥ ‹ కన్య భవ! మమ్ము మా భూమి - కానుకగను
‹ మీకు నర్పించితిమి. యిఁక - ప్రాకటముగ
‹ మిఱ్ఱయును హేమ ధూపంబు - మీకు నిచ్చి
‹ మ్రొక్కి లిడితిమి, సెలవిమ్ము - పెక్కులేల'. 96.

వ॥ ఇట్లు దేవ బాలుని స్తుతించి కానుకలను జెల్లించి
ముగ్గురు రాజులు వచ్చినమార్గమునఁ దమ తమ
పట్టణంబుల కేగ నున్న సమయమున. 97.

తే॥ ‹ మునుపు వచ్చిన దారిఁ - జనక వేరొ
‹ మార్గమునఁ బోవుఁడయ్య మీ - దుర్గములకు'
ననుచు నిద్దరలో నొక్క - యమరవరుఁడు

చెప్పఁ జనువా ర్త లాలించి - జరగి తప్పెను. 98.

వ॥ ముగ్గురు రాజులు తనవద్ద కు ఁ దిరిగి రానందుచేత హేరోదుఁడు భయాక్రాంతుఁడై చేసినది యేమంటే.

సీ॥ దేవ దూతలు బాల - దేవుని ఁ బొగడిన [99.

పొగడికలన్నియు - బొల్పుమీఱ

సుజ్ఞాను లొనరించు - స్తోత్రంబులను, విని

ప్రజలెల్ల నంగడిఁ - బలుకుచు నేసు

జెరుసల్యాపురి నృప - శేఖరుండై సర్వ

జూద జనాళిని ఁ - జోద్యములర

నేలు నటంచును బాలు-మాలిక పల్కు-

జన వాక్యముల - నడి నన్న తెలిఁగి,

తే॥ క్రూరమతియి హేరోదుఁడా - ' కువలయేశ

' త్రయము యేదారిని జనిరో - బయలు దేరి

' బాలకుని జంపితేగాని - పడయరాదు [100.

' రాజ్యమును గీర్తి ' యనియె నా-రాజవిభుఁడు.

వ॥ ఇట్లు కోపోద్దీపితుండైన హేరోదురాజు చేయు విధంబెటువలెను. 101.

ద్వి॥ జెరుసల్యాపురి నృప - శేఖరుండలిగి

పరువడి మీరఁగఁ - భటుల రావించి:

' ముందుగాఁ బెత్లెహే-మునఁ దానచుట్టు

' నంద మొప్పెడు పట్ట-ణంబులలోనఁ

' బెరిఁగెడు బాలురఁ - బిడియువఁ జంపు

' డరమరలే ' కని - యాజ్ఞలు చేయఁ

కుటిలాత్మకులు మహా - కుచ్ఛితమతులఁ

బటుతరాయుధములఁ - బట్టుకొని గుపిత -

కాలకింకరులకుఁ - గడలి రప్పరికిఁ.
జోలునే యిది నృప - పుంగవులకును? 106.

వ॥ అంతటఁ జోజప్పగారుకలలోఁ జూచిన దేమనఁగా.

చ॥ గగన చరుండొకం డరిగి -
కార్యము దెల్పుటకై నిజేచ్ఛతోఁ
బగతుఁడు బాలఘాతకుఁడు -
బంపి ప్రతాపముతోడఁ బాలురఁ
దెగ సతికించుఁ, గాన మరు-
దేశము బాలుని మోదమందుచుఁ
నగజేగి చేర్చి, యందున ని-
వాసము చేయు' మటంచుఁ బల్కెఁ దాఁ.

క॥ నిద్దుర మేల్కొని జోజెపు [108.
ముద్దుల బాలకుని దనదు - ముద్దియఁ గొని తా
సద్దుఁ సప్పిడి చేయక
గ్రద్దన నేజప్పునకును - గదలెను పిలుచున్ 109.

వ॥ ఇట్లు జోజెపు రాత్రిలో లేచి మరియమ్మనున్
బాలుసిన్ని వెంటఁబెట్టుకొని పోవుచున్న సమ
యమున. 110.

ఆ॥ నైపనమై నడవఁగఁ - బడిన బాధలు నోటఁ
బట్టి చెప్పఁదగునె - ప్రజకెవరికి?
సుతుని తల్లి దండ్రి - కుక్కునఁ దోడ్కొని
కతిపయ దివసాల - కరిగిరి వడిఁ. 111.

ద్విపద॥ జప్తునకొక - పీటనుండఁగను
కూరిరుఁడా హేరోదు - గోయను బంపఁ,
జారులు కెతేము - నరగునఁ జేరి

ధారుణిఁ బిడ్డలఁ - దైత్యులబాఱి
గొంతులు గోయుచుఁ - గొందఱఁ బట్టి
యింతింతలుగఁ జేసి - యిల్లిలు దూఱి
చంకలోఁ బిడ్డల - సరగున నీడ్చి
కొంకక మొగవేసి - కోత కత్తులను 115.
నటికంగ ; నింతంత-లై భువిఁ బడిరి.
మఱి గొందఱిని వారు - మమతయులేక
కడకాళ్లు వడిఁబట్టి - కఱినోర్వఁగొట్టి
మడియింపఁ ; గొందఱు - మనుజహంతకులఁ
గని పరుగిడఁ బోవఁ - గదియఁగాఁ బట్టి
నునసిత మరియల - నృక్కఁగాఁ గుమ్మ
టరసి పౌరజనంబు - లాహా! రవముతొ
బెరయఁగా నందఱు - భీతిల్లి యేడ్చి 119.
'నరకాకు వ్రారిట్టి - సంహార కృత్య
'మరలేక చేయ, నే_మందుమో యకట
'ఇఁక నేమి చేయుదు - మీఁక నెందుఁ బోను
'మకళంక బాలుర - కాపదవచ్చె'
నారీతి నేడ్చుచు - నంగలార్చినను ;
గూఱిర బంట్లకు రవ్వ - క్రుధ తగ్గదాయె. 122.

వ॥ మరియు జోసేపులు కొంతకాలమున నేపిప్తున నిలిచినపిదపఁ బరమేశ్వరుఁడు హేరోదుని దండించి చంపితిరని స్వప్నమునఁ దమ చెప్పఁగ ; వారలు సరగున నజరేతు పురికిఁ జేరిరి. అచటఁ బరమ పావనమూర్తి ప్రబలుచునుండెను. 123.

సమాప్తము.